వచన కవితా సంపుటి

# లోయలో మనిషి



సోమేపల్లి వెంకట సుబ్బయ్య

# లోయలో మనిషి

(వచన కవితా సంపుటి)

సోమేపల్లి వెంకటసుబ్బయ్య

**లోయలో మనిషి**

(వచన కవితా సంపుటి)

రచయిత : సోమేపల్లి వెంకటసుబ్బయ్య

ప్రథమ ముద్రణ : అక్టోబరు, 1997

ద్వితీయ ముద్రణ : మార్చి 2000

ప్రతులు : 500

Rs. 15/-

ప్రచురణ : విజయలక్ష్మి పబ్లికేషన్స్

ముఖచిత్రం : సూపర్‌సైన్, తణుకు

ప్రతులకు :

విజయలక్ష్మి పబ్లికేషన్

S. విజయలక్ష్మి

W/o వెంకట సుబ్బయ్య

26-104/A

చంద్రమతి భవన్

ఆచార్య రంగావీధి

తణుకు - 534 211

ముద్రణ : శ్రీ సత్య ఆఫ్‌సెట్ ప్రింటర్స్

తాడేపల్లిగూడెం, ఫోన్ : 23360

# మనిషికి ప్రతిధ్వని

- అద్దేపల్లి రామమోహనరావు
ప్రముఖ అభ్యుదయ కవి, విమర్శకులు

తనవైన ప్రత్యేక లక్షణాలతో, 'మినీ కవిత' రూపం, తెలుగు కవిత్వంలోకి వచ్చి, సుమారు ఇరవై ఏళ్ళు దాటింది. 1974 ప్రాంతంలో, సాంస్కృతిక సమాఖ్య జరిపిన కవితల పోటీకి వచ్చిన కవితల్ని, కార్యదర్శి వి. శిరీష్ కుమార్, అప్పటి ఆంధ్రజ్యోతి వార పత్రిక సంపాదకులు పురాణం సుబ్రహ్మణ్య శర్మ గారికివ్వగా, ఆయన 'మినీ కవిత' అనేపేరు పెట్టి ప్రచురించారు. అప్పటి నుండి ఈ రూపం యువతరాన్ని బాగా ఆకర్షించి, అన్ని పత్రికల్లో ఈ రూపం బాగా ప్రచలితమయింది. ఇప్పుడు బాగా ప్రసిద్ధిలోకి వచ్చిన కవులందరూ దాదాపుగా, ఆ రోజుల్లో మినీ కవితలు రాసిన వారే. సుమారు పదేళ్ళు ఈ రూపం, సామాజిక ప్రగతిశీల వస్తువు ప్రధానంగా అందర్నీ ఆకర్షించి, రూపానికి సంబంధించిన ఒక ఉద్యమమా అన్నంతగా వ్యాప్తి పొందింది. అప్పటికీ, యిప్పటికీ కవిత్వంలోప్రగతి శీల వస్తువుదే ప్రథమ స్థానం. అయితే అభివ్యక్తి రూపంగా మినీ కవిత ప్రత్యేకత ఒక ప్రభంజనంగా రూపొందింది.

విపరీతంగా ప్రచలితమైన దశ సన్నగిల్లిన తర్వాత కూడా ఆ రూపం కవితా రంగం నుండి తొలగిపోలేదు.

ఏదైనా కొత్తగా వచ్చినపుడు వరదలా వస్తుంది. తర్వాత నిదానంగా ప్రవహిస్తుంది. అలాగే మినీ కవిత ఈనాటి వరకూ చాలా మంది రాస్తున్నారు. ఆ రూపాన్ని సామాజికంగా వినియోగించుకుంటున్నారు.

ఇప్పుడు సహృదయ మిత్రులు శ్రీ వెంకట సుబ్బయ్యగారు మినీ కవితరూపాన్ని సద్వినియోగం చేసుకునే కవుల కోవలోకి ప్రవేశిస్తున్నారు. సామాజిక ప్రగతిశీలతత్వాన్ని, మినీ కవిత ద్వారా వ్యక్తం చేసే మార్గంలో ప్రయాణం ప్రారంభించారు. వారికి నా హృదయ పూర్వక స్వాగతం చెప్తున్నాను.

ప్రగతిశీలత మినీ కవితకు ఊపిరి. అది వెంకట సుబ్బయ్యగారి కవితల్లో అంతస్సూత్రంగా ఉంది. అభివ్యక్తి ప్రాణాన్ని గూడా పట్టుకోగలిగారనడానికి కొన్ని అంశాల్ని పరిశీలిస్తాను.

మినీకవితలో ఉన్న కొద్ది పాదాల్లో ఒక సమతూకం ఉండడమనేది దాని ముఖ్యలక్షణాల్లో ఒకటి. ఈ సమతూకం భావాన్ని ముద్రించే మార్గంలో మాత్రమే వస్తుంది. ఈ సమతూకంలో చివరి పదాలలో కనిపించే సామ్యం కూడా భావస్ఫురణకే దోహదం చేయాలి. కేవలం శబ్దలయ,అనుప్రాసల్లాగా కనిపించకూడదు. ఈ శిల్పం ఈ కవి గారికి కూడా పట్టుబడింది. 'హేయం' అనే కవితలో యిలా అంటారు.

'రక్త దానానికయితే
మనుషులే లోటు
రక్త దాహానికైతే
మనుషులు కోటాను కోట్లు'

పైన రెండు పాదాలు, కింద రెండుపాదాలు భావానికి సంబంధించిన సమతూకంతో సాగడం, శబ్ద సామ్యం భావ వ్యక్తీకరణలో మాత్రమే పర్యవసించడం, మొదలైన విషయాలు గమనించవచ్చు.

ఈనాడు కవిత్వం రాసే వారికి, ప్రగతి శీలమైన ఆలోచనలు ఉండడం సామాజిక బాధ్యతను సూచిస్తుంది. ఒక సన్నివేశాన్ని అర్థం చేసుకోవడంలోనే ఆలోచనల ఔచిత్యం వ్యక్తమౌతుంది. వెంకట సుబ్బయ్యగారి ఆలోచనలు సమకాలీన సమాజ ప్రగతికి దోహదం చేసేవి కావడం నాకు సంతోషం కలిగించింది. ఉదాహరణకి

ఆడది వ్యభిచరిస్తే
అపచారం
మగవాడికదే
విలాసం
రెండు చేతులు
కలిస్తేనే కదా చప్పట్లు
మరి స్త్రీ జాతికే
ఎందుకీ యిక్కట్లు?

ఏదైనా కొత్తగా వచ్చినపుడు వరదలా వస్తుంది. తర్వాత నిదానంగా ప్రవహిస్తుంది. అలాగే మినీ కవిత ఈనాటి వరకూ చాలా మంది రాస్తున్నారు. ఆ రూపాన్ని సామాజికంగా వినియోగించుకుంటున్నారు.

ఇప్పడు సహృదయ మిత్రులు శ్రీ వెంకట సుబ్బయ్యగారు మినీ కవితరూపాన్ని సద్వినియోగం చేసుకునే కవుల కోవలోకి ప్రవేశిస్తున్నారు. సామాజిక ప్రగతిశీలతత్వాన్ని, మినీ కవిత ద్వారా వ్యక్తం చేసే మార్గంలో ప్రయాణం ప్రారంభించారు. వారికి నా హృదయ పూర్వక స్వాగతం చెప్తున్నాను.

ప్రగతిశీలత మినీ కవితకు ఊపిరి. అది వెంకట సుబ్బయ్యగారి కవితల్లో అంతస్సూత్రంగా ఉంది. అభివ్యక్తి ప్రాణాన్ని గూడా పట్టుకోగలిగారనడానికి కొన్ని అంశాల్ని పరిశీలిస్తాను.

మినీకవితలో ఉన్న కొద్ది పాదాల్లో ఒక సమతూకం ఉండడమనేది దాని ముఖ్యలక్షణాల్లో ఒకటి. ఈ సమతూకం భావాన్ని ముద్రించే మార్గంలో మాత్రమే వస్తుంది. ఈ సమతూకంలో చివరి పదాలలో కనిపించే సామ్యం కూడా భావస్ఫురణకే దోహదం చేయాలి. కేవలం శబ్దలయ,అనుప్రాసల్లాగా కనిపించకూడదు. ఈ శిల్పం ఈ కవి గారికి కూడా పట్టుబడింది. 'హాయం' అనే కవితలో యిలా అంటారు.

'రక్త దానానికయితే
మనుషులే లోటు
రక్త దాహానికైతే
మనుషులు కోటాను కోట్లు'

పైన రెండు పాదాలు, కింద రెండుపాదాలు భావానికి సంబంధించిన సమతూకంతో సాగడం, శబ్ద సామ్యం భావ వ్యక్తీకరణలో మాత్రమే పర్యవసించడం, మొదలైన విషయాలు గమనించవచ్చు.

ఈనాడు కవిత్వం రాసే వారికి, ప్రగతి శీలమైన ఆలోచనలు ఉండడం సామాజిక బాధ్యతను సూచిస్తుంది. ఒక సన్నివేశాన్ని అర్థం చేసుకోవడంలోనే ఆలోచనల ఔచిత్యం వ్యక్తమౌతుంది. వెంకట సుబ్బయ్యగారి ఆలోచనలు సమకాలీన సమాజ ప్రగతికి దోహదం చేసేవి కావడం నాకు సంతోషం కలిగించింది. ఉదాహరణకి

ఆడది వ్యభిచరిస్తే
అపచారం
మగవాడికదే
విలాసం
రెండు చేతులు
కలిస్తేనే కదా చప్పట్లు
మరి స్త్రీ జాతికే
ఎందుకీ యిక్కట్లు?

పై కవితలోని భావం ఈనాటి స్త్రీ వాదంలోని పురుషాహంకార నిరసనకి నిదర్శనంగా ఉంది. అపచారం, విలాసం- అనే పదాల ప్రయోగం, యిద్దరికీ ఉన్న సామాజిక స్థానంలోని అన్యాయమైన భేదాన్ని సరిగ్గా వ్యక్తం చేస్తుంది. వక్ర ప్రవర్తన, మగ వాడికి కూడా అప్రతిష్టాకరమే కావాలనే సిద్ధాంతం ధ్వనించడం బాగుంది.

వెంకటసుబ్బయ్యగారు మినీ కవితలే కాదు, మామూలు కవితలు కూడా రాశారు. అన్నిటిలోను ఆయన భావాలుమెచ్చదగినవిగా ఉన్నై.

ఒక కవిలో పునాదిగాఉండే భావాలలో ఎంత ఔచిత్యం ఉన్నా, నిరంతర కృషి, అధ్యయనం, వాటి పరిధిని విస్తృతం చేస్తై. ప్రగతి శీల భావాలు, నేపధ్యంలో ఉన్న సామాజిక సిద్ధాంతాల్ని అవగాహన చేసుకుంటే యింకా రాటుదేలతై. వెంకట సుబ్బయ్య గారు, తనకు లభించిన కవితా మార్గాన్ని, అధ్యయనం చేత యింకా యింకా మెరుగుపెట్టుకొని, పురోగమిస్తారని ఆశిస్తాను. సుప్రసిద్ధ కవి, కథకులు, ఆత్మీయులు శ్రీ రసరాజు, వెంకట సుబ్బయ్య గారిని నాకు పరిచయం చేసారు. ఇక వెంకట సుబ్బయ్యగారి మార్గం ఉన్నత పథాల్లో కొనసాగాలని కోరుతూ.....

# శిఖరం మీద చూపు

## - రసరాజు

ప్రముఖ కవి, కథకులు

ఇవ్వడివ్వడే కవిత్వంలో కాలూనటం వల్లనోయేమో వెంకట సుబ్బయ్య గారి రచనలో "అస్పష్టత'కు చోటు లేకపోయింది. పాపం! అందరికీ అర్థమయేలా వ్రాశారాయన. ఒకవేళ, ఎదిగే కొద్దీ ఆ "గజిబిజ" సృష్టిస్తారేమో - అప్పడు చుద్దాం........

వెంకటసుబ్బయ్యగారు - ఏ మాత్రం వెనకటి సుబ్బయ్య కారు. కవిగా బయట పడిపోయారు....... "కవిత్వం" అంటే ఆయనకు అభిరుచే ఉందనుకున్నా ఇంతవరకూ. అభినివేశం కూడా ఉందని ఈ సన్నివేశంతో తేలిపోయింది.

"లోయలో మనిషి" చుట్టూ తిరిగింది ఈ కవితా సంపుటి. ఈనాటి మనిషి - నిజంగా లోయలో మనిషే!.......... శిఖర సదృశమైన ఆలోచనలు అతనిలో ఎంత మాత్రం లేవు. మానవీయ మూల్యాల నుండి జారిపోయి జారిపోయి ఎక్కడో అగాధాల్లోకో, లోయల్లోకో రోజురోజుకీ పడిపోతున్నాడు. స్వార్థం అంచున నిలబడి కుప్పకూలిపోతున్నాడు. ఈ వ్యవస్థనంతా - వీడియో పెన్ పట్టుకొని - పేపర్ ఫిల్మ్ మీద కెక్కించారు వెంకట సుబ్బయ్యగారు.

అసలు - అభ్యుదయ కవి సమాజానికి దూరంగా ఉండి గాలి పీల్చలేడు. "బాధ" అనిపిస్తే - బావురు మనటం అతనికి చేతకాదు. ముల్లుగుచ్చుకుంటే - మూలుగుతూ ముసలమ్మలా కూర్చోవటం అసలే తెలీదు. అక్షరాలు అతన్ని ఆహ్వానిస్తాయి. కలం కనబడుతుంది. అది అతని చేతిలో ఆయుధమవుతుంది. అంతే...... అతను కదనరంగంలోకి దూకుతాడు.

ఇప్పుడు వెంకటసుబ్బయ్యగారు చేసిందీ అదే..... ఇందులో ఏ కవితను తీసుకొన్నా - సమాజమే అందులో ప్రతిబింబమై కనిపిస్తుంది.

"మనోడేనా" కవిత చూడండి -

ఆరుబయట దంచే ఉపన్యాసాల్లో - అంతా మనవాళ్ళే......... కనిపిస్తారు. కులమత భేదాలకుట్రలేవీ కనిపించవు. కాని, ఆచరణదిశగా పయనించేటపుడు మాత్రం - "మనోడా! కాదా....." అనే విభజన మాత్రం గుండెలోతుల్లోంచి తన్నుకు వస్తుంది. ఆ ఆశయాలూ, ఆదర్శాలూ చిల్లిగవ్వకు కూడ ఇక్కడ పనికిరావు. ఇదీ ఈనాటి వ్యవస్థ! చూస్తే - ఇక్కడే ఉన్నాడు "లోయలో మనిషి".

సాటి మనిషిని బతికించటానికి కాసింత రక్తం దానం చేయమంటే - బలంగా ఉన్న మనిషి కూడ - ముందుకు రాలేకపోతున్నాడు. అదే - పచ్చినెత్తురు

త్రాగటానికయితే - వేలు - లక్షలు - కాదు - కోట్ల కొద్దీ జనం క్యూలో నిలబడతారు.

"రక్తదానానికయితే
మనుషులేలోటు
రక్తదాహానికయితే
మనుషులు కోటానుకోట్లు....."

ఈ కవితకు "హేయం" అనిపేరు పెట్టారు రచయిత. అంటే కవిగా ఆయన ఎంత విలవిల్లాడిపోయారో దీన్ని బట్టి అర్థమవుతుంది. ఇక్కడ కూడ కనిపిస్తున్నాడు" లోయలో మనిషి...."

"దళారోడు" ముందు, దగా పడుతూ చితికి పోతున్న బతుకుతాలుకు మూలుగు, ఇక్కడ ఈ కవితలో ప్రస్ఫటంగా వినిపిస్తున్నది.

"దుక్కిదున్నిందినేను
మట్టిపిసికిందినేను
రేయింబగళ్ళు
రెక్కలు ముక్కలు
చేసుకుంది నేను
పంటడబ్బు పట్టుకెళ్లింది మాత్రం......"

ఎవరూ? దళారోడు! - శ్రమను దోపిడీ చేస్తున్న ఒక వర్గంవైపు కవికసితీరా విసిరిన చురకత్తిలాటి చూపు ఇది.

పరిమళించిన మానవత్వానికి అద్దం పట్టిన కవిత "మనీషి". దేవుడున్నాడా? లేడా? అనే మీమాంసతో

కొట్టు మిట్టాడే కంటె ముందు "మనిషి"గా బ్రతకటం నేర్చుకోమంటున్నారు కవి.

గాలిబ్ అనలేదూ - "ప్రతిది సులభముగా సాధ్యపడదులెమ్ము, నరుడు నరుడౌట ఎంతో దుష్కరము సుమ్ము" అని. మానవునిగాపుట్టి - ఆ గుణాన్ని నిలబెట్టుకుంటే ఇంకేం కావాలి!

వర్త "మానం"లో వనిత - ఈ కవితా సంపుటిలో చాలచోట్ల మన కళ్లముందు సాక్షాత్కరిస్తుంది. "ఆమె" ఇంటా బయటా ఎదుర్కొంటున్న వేదనాశిఖలు "సహృదయం" ఉంటే, ఇక్కడ మనల్ని కూడ తాకుతాయి. అన్ని రంగాల్లోనూ "ఆమె"కు అగ్రాసనం లభించినా ఆయారంగాల్లో "విలనీయం" మాత్రం ఆమెను వెన్నంటి వేటాడుతుందన్న వాస్తవం ఇక్కడ మనకు తేటతెల్లమవుతుంది. ఏది ఏమైనా వెలుగుతూ వెలుగుతూ కరిగిపోతున్న కొవ్వొత్తి "ఆమె"! స్త్రీ చీరకట్టిన దశలోనే కాదు- శిశు దశలో కూడ జీవించలేకపోతోంది. దానికి జిరాక్సు కాపీ ఈ "బలిపశువు" కవిత.

"కట్నంకోసం
కన్నుమిన్నుకానక
కాల్చుకుతినేవారొకరు
తల్లికడుపులో శిశువుగా వుండగనే
"స్కానింగ్" కళ్లతో కనిపెట్టి

కడతేర్చేవారొకరు......" ఎంత దయనీయం! ఎంత అమానుషం!....... కవి కలవెత్తి, గళమెత్తి రోదించారిక్కడ. గుండెలు బాదుకున్నారిక్కడ. చెవులుండి సమాజం వినిపించుకోవాలి మరి...........

కవి-చివరికి ఈనాటి "విచిత్రసీమ"ను కూడా వదిలిపెట్టలేదు. ఎందుకు విస్మరించాలి?..... తోటలో ఏ చెట్టూ విషఫలాల్ని అందివ్వకూడదు కదా!.... సినిమాలకు పెట్టేపేర్లు ఎంత జుగుప్సాకరంగా, భయంకరంగా తలలు విరబోసుకొని సంచరిస్తున్నాయో మనం చూస్తున్నదే!

"ఛీ.....పో" తెరమీద అదే వ్రేలెత్తి చూపించారు వెంకటసుబ్బయ్యగారు.

ఇలా ఇలా - ఈ కవితా సంపుటిలో- "లోయలో మనిషి" అడుగడుగునా కనిపిస్తూనే ఉన్నాడు.

వెంకటసుబ్బయ్యగారి దృష్టిలో "మనిషి" అలా ఉండ కూడదు! శిఖరం మీద దీపంలా కనిపించాలి. కవిగా ఆయన చూపు కూడ అదే!.....

ఆయన "కవితా నర్తకి"కి ఇది ఆరంగ్రేటమ్. అక్కడక్కడ "ఇంకా బాగుండాలి.." అనే అభిప్రాయం కవితా హృదయంతో చూసే వాళ్లకి కలగకమానదు. "ఎంత చెక్కితే ఓ శిల్పం"!...... అవన్నీ రానున్న కాలంలో - కావ్యంలో - ఆయన పోషించుకో గలరనే నమ్మకముంది. ఆ "ఎదుగుదల"ను ఆయన్నుంచి మనంకూడ ఆకాంక్షిద్దాం!.......

## మీ ముందుకిలా......

నేను కవిత్వం రాయాలని కాని, రాస్తానని కాని ఎప్పుడూ అనుకోలేదు. అసలు నాకు ఆ సబ్జెక్ట్ తెలియదు. నేను చదివింది కామర్స్. ఆ తర్వాత కొన్నాళ్ళు స్వగ్రామంలో వ్యవసాయం. తదుపరి హైదరాబాద్ ఆంధ్రజ్యోతి దినపత్రికలో మూడేళ్ళు సబ్ ఎడిటర్ ఉద్యోగం. ఆ కాలంలోనే తెలుగు సాహిత్యం చదవడం, అక్కడక్కడ నగరంలో జరిగే సాహితీ సభలకు హాజరవ్వడం చేసేవాణ్ణి. పత్రికకు వార్తలు, చిన్న చిన్న కథలు, జోకులు రాసేవాణ్ణి. అంతేగాని కవిత్వం గురించి ఏమీ తెలియదు. ఆ తర్వాత రెవిన్యూ శాఖలో డిప్యూటీ తహసిల్దారుగా పశ్చిమగోదావరి జిల్లాకి వచ్చాను. 1991 నుంచి మండల రెవిన్యూ అధికారిగా పని చేస్తున్నాను. నాకు ఎప్పడైనా ఖాళీ సమయంలో ఏదైనా ఆలోచన తట్టినపుడు వాటికి వాక్య రూపం అందించాను. నా శ్రీమతి విజయలక్ష్మి వాటిని ఒక క్రమంలోకి తీసుకొనిరావడం, మార్పు చేర్పు చేసి తీర్చి దిద్దడం ద్వారా సహకరిస్తూ ఉండేది. గత మూడు నాలుగేళ్ళలో రాసినవే సుమారు ఈ పాతిక కవితలు. కవిత్వంలో లోతుకు వెళ్ళడం ఇప్పటిదాకా తెలియదు. నేను రాసిన కవితల్లో ఒకటి రెండు తాడేపల్లిగూడెం కవిసమ్మేళనంలో చదివాను. అవి దిన పత్రికల్లో చోటు చేసుకున్నాయి. ఒకసారి పత్రికలో పడిన ఓ కవితను అప్పటి జిల్లా కలెక్టర్ శ్రీ డి. రామకృష్ణగారు

చదివి చాలా బావుందంటూ మెచ్చుకొని ఇంకేమైనా రాశావా? అని అడిగారు. నేను రాసిన కవితల డైరీ ఆయనకిచ్చాను. ఆయన చదివి బావున్నాయి. అచ్చు వేయించు అన్నారు. ఆయన నా కవితలు చదివి బావున్నాయి అన్న తర్వాత మరికొన్ని రాసాను. వారిచ్చిన ప్రోత్సాహమిది. ఇప్పటి దాకా రాసిన దాదాపు పాతిక కవితలు పుస్తకం రూపంలో తేవడానికి సంకల్పించాను. తెలుగు సాహితీ సమాఖ్య కార్యదర్శి గోపాల రాజు గారి ద్వారా సుప్రసిద్ధ కవి, కధకులు శ్రీ రసరాజు గారిని కలుసుకున్నా. వారు సహృదయంతో నన్ను ఆహ్వానించి, నేను రాసిన కవితలు చదివి "మీరు రెవిన్యూ డిపార్ట్‌మెంట్‌లో వుండి రాయడమే గొప్ప" అన్నారు. కవితలన్నీ బావున్నాయి అని వెన్ను తట్టారు. ప్రతి కవితను చదివి అందులో బాగోగులను నాకు వివరించారు. వారిని ఈ సంపుటికి ముందు మాట రాయమని కోరాను. వారు ఎంతో ప్రోత్సాహం ఇచ్చి వారి యొక్క అమూల్యమైన అభిప్రాయాన్ని రాసి ఇచ్చారు. అలాగే సుప్రసిద్ధ కవి, విమర్శకులు శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారిని కూడా పరిచయం చేసి వారి యొక్క అమూల్యమైన అభిప్రాయాన్ని కూడా రాయించారు. రసరాజు గారు, అద్దేపల్లి రామ్మోహనరావు గారి ప్రోత్సాహం నేనెన్నటికీ మరువలేను. నేను ఎప్పుడో తర్వాత కవితా సంపుటి వేద్దామనుకున్నాను. కాని రసరాజు గారు,

రామమోహనరావు గారి ప్రోత్సాహం వల్ల వెంటనే ఈ సంపుటిని ఇలా మీ ముందుంచాను. ఇదీ ఈ పుస్తకం రావడానికి నేపథ్యం.

ఈ ప్రయత్నంలో నాకు సహకరించిన ప్రతి ఒక్కరికీ నేను కృతజ్ఞుణ్ణి. ముఖ్యంగా ఈ పుస్తకం బయటకు రావడానికి నన్ను ఎంతో ప్రోత్సహించి, తమ యొక్క అమూల్యమైన అభిప్రాయం రాసి ఇచ్చిన శ్రీ రసరాజు గారికి నా ధన్యవాదములు తెలుపుకుంటున్నాను. సహృదయులు, ప్రముఖ కవి శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారు నా కోసం ఎంతో సమయం వెచ్చించి నా కవితలన్నీ చదివి వారి యొక్క 'మాట'ను రాసారు. వారికి నా నమస్సులు నివేదించుకుంటున్నాను. అలాగే ఈ పుస్తకం తయారు చేయడానికి నేపథ్యంలో వున్న నా శ్రీమతి విజయలక్ష్మికి నా శుభాకాంక్షలు. అతి తక్కువ సమయంలో ముఖ చిత్రాన్ని అందంగా తీర్చిదిద్దిన సూపర్ సైన్, తణుకు వారికి, ఈ పుస్తకాన్ని ముచ్చటగా ముద్రించి యిచ్చిన సత్య ఆఫ్‌సెట్ ప్రింటర్స్, తాడేపల్లిగూడెం వారికి నా హృదయ పూర్వక అభినందనలు.

- సోమేపల్లి వెంకట సుబ్బయ్య

# నడక.........

జననీ జనకులకూ.....

జన్మభూమికీ........

# సౌందర్యం

అందం
కాళ్ళకుబంధం
సౌందర్యం
హృదయానుబంధం
అందరిలో వుంటుంది
అందం
ఆత్మ సౌందర్యానికే
అందలం

## 'నగ్న' సత్యం

చట్టం చట్రంలో కట్నం
నానాటికీ కట్టుదిట్టం
సమాజ విపణిలో మాత్రం
బేరసారాలే నిత్య కృత్యం

# పిలుపు

ప్రేమ మైకంలో
ప్రియా, ప్రియా
పెళ్లి పర్వంతో
ఏమేయ్, ఒసేవ్!

## చావు బతుకులు

మిట్ట మధ్యాహ్నం !
అడవి తుమ్మ చెట్టు కింద
చాలీచాలని నీడలో
నులక మంచం పట్టె మీద
బట్టతల ఆనించి
చెట్టు ఆకుల సందులో నుంచి
కంటిలో పడుతున్న
ఎండకు అడ్డంగా
చిరుగుల కండువా కప్పకొని
దీర్ఘాలోచనలో పడ్డాడు
వరుణ దేవుని కరుణ లేదు

(Contd...)

సూర్యదేవుని కోప తాపం
ఈ పంటలు పండేనా?
బక్క రైతు డొక్క నిండేనా
అటు అప్పుల బాధ
ఇటు ఆకలి ఘోష
ఆటు పోటు తట్టుకొనే
స్థయిర్యం లేదు
చావో బతుకో తేల్చుకోలేక
చచ్చి బతుకుతున్నాడు.

# మనోడేనా?

అక్కడ,
బహిరంగ వేదిక
అనర్గళ ఉపన్యాస గీతిక
కులం లేదు,
మతం లేదు
భాషా భేదం అసలే లేదు
ఇక్కడ;
రహస్యచర్చా మందిరం
అంతరంగ తరంగ వీక్షణం
ఉద్యోగానికి
పదవీ యోగానికి
వివాహానికి
అన్నిటికీ ఒకటే ప్రశ్న
"మనోడేనా?"
సందేహించకు నేస్తం
ఇది "గాంధీ" పుట్టిన దేశం

# తేడా

కళ్ళు మూసుకుని
పాలు తాగే పిల్లి
తననెవరూ
చూడలేదనుకుంటుంది
అమాయకత్వంతో.
కళ్ళెదుటే
ఘోర కృత్యాలు
చేసే మనిషి
ఎవరు చూస్తే
తనకేం అంటాడు
అమానుషత్వంతో!

## ఇంకెన్నాళ్ళు !

సుధ,

రాధ,

సుజిత,

రజిత

వనిత ఎవరైనా,

ఒక్కటే వ్యధ

సమత సాధిస్తేనే

మారేను నేటి కథ.

# నేటి విద్యార్థి

అశోకుడు
అక్బర్
తాంతియాతోపే
వీరందరి
తాత ముత్తాతల
పుట్టుపుర్వోత్తరాలు
వల్లెవేసే
నేటి విద్యార్థి
తన తాత ముత్తాతల
పేర్లడిగితేనే
తెల్ల మొహం వేస్తాడు.!

## సమత

నవ వధువైనా,

నలుగురు బిడ్డల

తల్లయినా,

నడివయస్సయినా,

అత్తింటి ఆరళ్ళకు

అందరూ ఈక్వల్!

# మనీషి

ఉన్నాడో లేడో
తెలియని
దేవుడి గురించి
ఆస్తికత్వం, నాస్తికత్వం
పేరిట వాదులాడుకునే
ఓ మనిషీ!
మానవత్వం చూపిస్తే
నువ్వు అవుతావు
"మనీషి".

# నేటి భారతం

మనసులు

మమతలు

మానవతా విలువలు

మనమంతా మరుస్తున్న

మంచిమాటలు

మన కులం

మన మతం

మన ప్రాంతం

జనమంతా జపిస్తున్న

ఈనాటి మాటలు

స్వతంత్ర భారతికి యాభై ఏళ్ళు

ఈ కుళ్ళు, కుతంత్రాలు

ఇంకెన్నాళ్ళు?

## కలవరం

కళ్ళు కళ్ళు
కలిపిచూడు
ప్రియురాలైతే
పరవశం
పెళ్ళామైతే
కలవరం

## బతుకు

ఎద్దు వీపుపై పుండు
నవజీవన సమరంలో
సామాన్యుడి
బతుకు బండి.

# ఈక్వే

మైనస్ ఇంటు మైనస్ ప్లస్
ఇది మేథమెటికల్ ఈక్వేషన్
మైనస్ ఇంటు మైనస్ మైనస్
ఇది ఆడపిల్లల బతుకు సీక్వెన్స్

## హేయం

రక్త దానానికయితే
మనుషులే లోటు
రక్త దాహానికయితే
మనుషులు కోటానుకోట్లు

# ఆమె

ఆమె.......
చదువులో సరస్వతి
అందంలో అపురూపవతి
వినయంలో గుణవతి
నడతలో నాయకి
ఆమె
రోడ్డు మీదకొస్తే
రోమియోల బెడద
ఆఫీసు కెళితే
సహోద్యోగుల సూటిపోటు మాటలు
ఇంట్లో  అయిన వాళ్ల ఆరళ్ళు
భర్త, అత్త అంటేనే
"యమ" భయం
ఆమె వేదన అరణ్య రోదన
ఆమె జీవితం వెలిగే కొవ్వొత్తి!

సోమేపల్లి వెంకట సుబ్బయ్య

## దళారోడు

దుక్కి దున్నింది నేను
మట్టి పిసికింది నేను
రేయింబవళ్ళు
రెక్కలు ముక్కలు
చేసుకుంది నేను
పంట డబ్బు పట్టుకెళ్ళింది మాత్రం........

# స్వార్థం

భావానికి వాహికను
బంధానికి హేతువును
జగానికి
జనానికి
జీవన యాత్రారథానికి
సంధానాన్ని
అయితేనేం
హిందీ, తమిళ
తెలుగు, ఉర్దూ
ఒరియా, మళయాళ
రకరకాల రంగులతో
స్వార్థ పర శక్తులు
చిచ్చుపెట్టి, రెచ్చగొట్టి
నన్ను రచ్చకీడుస్తున్నాయి.

# న్యాయం

ఆడది వ్యభిచరిస్తే
అపచారం
మగవాడికదే
విలాసం
రెండు చేతులు
కలిస్తేనే కదా చప్పట్లు
మరి స్త్రీ జాతికే
ఎందుకీ ఇక్కట్లు!

# అబల

నేను,
విరించినవుతా
నవ కవనం కోసం
నేను
ఉషస్సునవుతా
తిమిర సంహరణ కోసం
నేను
సమీరమవుతా
సరస సల్లాప ఉల్లాసం కోసం
నేను
ఏమవ్వగలను?
అబలను సబల చేసేందుకు
ఆడదాని బతుకు ముంగిట
రక్తపు రంగ వల్లులు
చెరిపేందుకు?

## ఛీ.. పో

దొంగ

రౌడీ

రాస్కెల్

ఛీ... పో

తిట్లు కావివి హలో

తెలుగు సినిమా

టైటిల్సు ఛలో!

# విలువ

బతికినన్నాళ్ళూ
"మనిషి" గా బతుకు
పుట్టాం కనుక
తప్పదు బతకక "అనకు"

## బలిపశువు

కట్నం కోసం
కన్నుమిన్ను కానక
"కాల్చుకు" తినేవారొకరు
తల్లి కడుపులో శిశువుగా వుండగనే
"స్కానింగ్" కళ్ళతో కనిపెట్టి
కడతేర్చేవారొకరు.

## వర్త'మానం'

భరత మాతను

బానిసను చేసి

పాలించారు

తెల్లదొరలు

భరతమాత

మాన ప్రాణాలను

పణంగా పెడుతున్నారు

వర్త“మాన” హరులు

## ఇదా న్యాయం!

ఇదెక్కడి న్యాయం

ప్రియా!

నీది, నాదీ ఒకే కులం

"చదువు" కులం

నీదీ, నాదీ ఒకేబాట

ఉద్యోగపు వేట

కానీ నువ్వుకట్నం కావాలన్నావ్

కట్నం లేకుంటే

కాణీకి చెల్లనన్నావ్

నన్ను మర్చిపో !

# ఎక్కడకీ ప్రయాణం?

ఎక్కడకీ ప్రయాణం?
ఏమిటి నీ గమ్యం
శాంతి సహనం
ఎండమావులు
పతనం అంచున
నైతిక విలువలు
పట్టపగలే
రాక్షస కృత్యం
మంచి చెడు
విచక్షణ లేదు

(Contd.....)

తల్లీ చెల్లీ తలపుకురారు
పరాయి ఆడది లోకువ నేడు
అరాచకత్వం ప్రబలుతు వుంటే
అమాయకత్వం అణగుతు వుంటే
ఎక్కడకీ ఈ ప్రయాణం
ఏమిటి నీ గమ్యం
సుఖ శాంతుల సౌధానికా
అశాంతి అగాధానికా
ఎక్కడకీ ప్రయాణం

లోయలో మనిషి



## సోమేపల్లి వెంకట సుబ్బయ్య

జన్మభూమి : ప్రకాశం జిల్లా, యద్దనపూడి మండలం, గన్నవరం గ్రామం

తల్లితండ్రులు : సోమేపల్లి హనుమంతరావు నాగరత్నం

విద్య : ఎం. కామ్.,

ఉద్యోగం : ప్రస్తుతం తణుకు మండల రెవిన్యూ అధికారిగా పనిచేస్తున్నాను.

**లోయలో మనిషి**

తొలి వచన కవితా సంపుటి